ఈశా భక్త కల్పద్రుమా శతకం

ప్రథమ ముద్రణ -
శ్రీ హేమలంబ శ్రావణం, ఆగష్టు 2017

రచయిత : ఎన్.వి.అనంతకృష్ణ

వెల : అమూల్యం



ప్రాప్తి స్థానము :
ఎన్.వి.అనంతకృష్ణ
ప్లాట్ నెం.80, శ్రీ సాయి నగర్,
రోడ్డు నెం.4, శ్రీ సాయిబాబా గుడి ఎదురుగా,
నాగోల్ పోస్ట్, హైదరాబాద్ - 500 068.
ఫోన్- 92465 31895.

# మంత్రమూలం గురోర్వాక్యం

చి॥ అనంతకృష్ణ రచించిన లలితా దేవి యొక్క స్తవరూపమైన శతకమును చూచితిని. అతి లలితమైన పదముల సమూహముతో, సమాస భూయిష్టమై అన్వయ కాఠిన్యమును లేక, మిక్కిలి చెవులకింపైన పరిశు ద్ధమైన అచ్చుతెనుగు పదములతో ధారాశుద్ధి గలిగి లలితా స్తవమును రచించిన మా శిష్యునికి శతాయువు లొసంగి నిత్యోన్నత స్థితిని కల్గించవలసినదని మదీయ యిష్టదైవమైన శ్రీమన్మహారాజరాజేశ్వరీ షోఢాంబా జగన్మోహినీ పరదేవతా శ్రీమహా త్రిపుర సుందరిని ఆశీస్సులిమ్మని కోరుకుంటూ..

ఇట్లు

**పరమానందనాథ దీక్షానామాంకిత**
**విద్వాన్ రాళ్ళభండి సుబ్రహ్మణ్య దీక్షితులు**
తేదిః 16.6.2002

# కల్పద్రుమ సౌరభం

"సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా" అని నారద మహర్షి భక్తికి నిర్వచనం చెప్పారు. యధార్థంగా సృష్టిలోని ప్రాణికోటిలెల్ల పరమాత్ముడే పరమాప్తుడు. త్రికరణ శుద్ధిగా పరమాత్మనే గుండె గుడిలో నిలుపుకొన్న భక్తుని ప్రేమ అచంచలం, అకలుషం అని నారద మహర్షి సూత్రీకరించారు.

ఆ భక్తుడు భావుకుడైతే, రసవద్భావాలు ఆ భక్తుడి హృదంతరం నుంచి నిరంతరం జాలువారుతూ ఉంటాయి. అతడు భాష తెలిసిన విద్యావంతుడైతే, ఛందో వ్యాకరణాలంకారాలు పట్టువడిన పండితుడైతే ఆ భావాలు సరసమైన కవితలు అవుతాయి. ఆ కవితలు ప్రామాణికమైన పద్యాలు అవుతాయి. ఆ అంతరంగ తరంగాలు శతథా పెల్లుబుకుతాయి. ఆ ఆత్మాశ్రువులు భావవాహినియై ఒక శతకమై 'సహృదయుల' ముందు సాక్షాత్కరిస్తుంది.

శ్రీ అనంత కృష్ణగారు భక్తులు, భావుకులు, సరసులు, సంప్రదాయజ్ఞులు, విద్యావంతులు, పండితులు. న్యాయ విద్యా విశారదులైన ఈ కవి హృదయ మందిరములో కవితా పుష్పాలతో నిత్యమూ పంచాయతన పూజ జరుగుతుంది. ఆ పూజాఫలముగా నాణ్యమైన నాలుగు శతకాలు ఇప్పటికే తెలుగు జాతికి అంది వచ్చాయి. పరమేశ్వర నామం వింటే పరవశించే ఈ మహనీయుని హృదయ వేదికపై నాట్యం చేసిన భక్తిభావానికి ప్రతిరూపం ఈ శతకము. ఈ భక్తుని హృదయనందనంలో శత శాఖలుగా విస్తరించిన కల్పద్రుమం ఈ శతకం.

"ఆశుతోషుడైన" స్వామి తత్త్వం ఈ కవికి స్ఫురించిన మొదటి అంశం. తాను స్వామిని సమర్చనం చేయడం "ఏ జన్మ పుణ్యంబహో"

అని మురిసిపోతూ, "నిన్నిక వీడకుండ గనుము.." అని తనలో ఈ భక్తి స్థిరంగా నిలిచే స్థితి కూడ స్వామి అనుగ్రహమేనని ఈ కవి భావించారు. రక్షణ, శిక్షణల విషయంలో పక్షపాతం లేనివాడు పరమేశ్వరుడు. అందుకు కావలసినన్ని సాక్ష్యాధారాలున్నాయంటారు కవి.

స్వామికి తన పట్లగల దయాగుణాన్ని తాను తలుచుకుంటే చాలు, తనకు ఆనంద బాష్పాలు స్రవిస్తాయని అంటారు కవి. పరమశివుని లీలా వైభవంతో ఈ కవి మనస్సంతా నిండిపోయింది. దుస్సహమైన కాలకూటాన్ని కంఠంలో దాచుకోవడం, డమరుక రవళు లలోనుండి అక్షర సమామ్నాయాన్ని ఆవిష్కరింప చేయడం, అర్ధనారీశ్వరుడై అవతరించడం, లయకారుడుగా తమోగుణ ప్రధానుడుగా కన్పిస్తూనే జ్ఞాన స్వరూపుడైన దక్షిణామూర్తిగా అవతరించడం, మార్కండేయుణ్ణి చిరంజీవిని చేయడం మొదలగు లీలలెన్నో ఈ శతకం లో చోటు చేసుకున్నాయి.

భక్తి శతక రచనలో ఆర్తికి ప్రాధాన్యం కన్పిస్తుంది. "లోకాలన్నీ నువ్వే కాలమూ నీ స్వరూపమే, నిరాకార సాకారాలు నీ రూపమే..." నని పరమేశ్వర తత్త్వాన్ని మననం చేసుకుంటూ, ఈ కవి "నీ లీలల్ తెలియంగ జాలనిన్ నన్నే రీతిగా బ్రోతువో" అని, తన్నుద్ధరించే బాధ్యతను స్వామికే అప్పగించారు. లోపలి, వెలుపలి లోకాలను రక్షించే లక్ష్యంతో కాలకూటాన్ని కంఠంలో దాచుకున్న పరమేశ్వరుని పరమ కరుణా వైభవాన్ని ప్రస్తుతించారు కవి. "నా2రుద్రో రుద్రమర్చయేత్" శివారాధన వల్ల జీవుడు శివుడే అవుతాడు. అలాంటి సందర్భములో "వేరౌచు నేనుందునే.." అని స్వామిని ప్రశ్నించడంలో ఈ కవికి గల అసలు సిసలు నమ్మకం తెల్లమౌతుంది.

తనకు, తన ఆరాధ్య దైవానికి అభేదాన్ని దర్శిస్తూ అందుకు ప్రమాణాలను నిరూపించిన కవి భావన అసాధారణం. తనలోని నాడులే సర్పాలని, తనలోని జ్ఞానమే మూడవ కన్ను అని, తనలోని చైతన్యమే శక్తి అని, మేల్కొన్న సహస్రారమే చంద్రుడని, ఇడా, పింగళా సుషుమ్నా నాడులే "త్రిపథగా" అయిన గంగా ప్రవాహమని కవి చెప్పిన పోలిక సాధనలో కవి పొందిన పరాకాష్ఠ స్థితికి, అభివ్యక్తి సామర్థ్యానికి అక్షర సాక్ష్యం.

అసలైన భక్తుడు ఆరాధ్య దైవాన్ని ఏమి కోరుకోవాలో ఈ శతకములో కవి ఉదాహరణాత్మకంగా ఉపదేశించారు.

"ఇమ్మా సాత్విక భావనల్ ప్రబలమౌ యిక్కట్లు పోనాడి రా
నిమ్మా తాత్విక చింతనల్ సఫలమై యీడేర్చగా కామనల్
కొమ్మా రాజస తామసాది గుణముల్ క్రోధాదులన్ శీఘ్రమే...." అని చేసిన ప్రార్థన భక్తుల ఆలోచనకు ఆచరణకూ ఒజ్జబంతి. సృష్టి స్వరూపుడు పరమేశ్వరుడు. పంచ భూతాత్మకం ఈ సృష్టి. కనిపించే ఈ సృష్టి ఆధ్యాత్మిక సాధనకు ప్రేరణ అని కవి భావన. "భూమిన్ జూడగనోర్పు కాంచితిని....... సాధక లక్షణంబనగ..." అన్న పద్యంలో పంచ భూతాలనుంచి సాధకుడు నేర్చుకోవలసినదేమిటో నేర్పుగా నేర్పారు కవి.

సన్మార్గంలో సాగేందుకు కావలసిన సత్యం జీవుడికి అంత సులభంగా స్ఫురించదు. "అహమిత్యంతః స్ఫురంతం సదా..." అని ఆది శంకరులు సెలవిచ్చినట్లుగా ఆ స్ఫురణ కూడా శివానుగ్రహమే. "జీవుణ్ణి కనుక నాకు తెలియదు. తెలియచెప్పవలసిన బాధ్యత నీదేనయ్య.." అని పరమాత్మను చనువుగా ప్రశ్నించే తీరు ఈ రచనలో కన్పిస్తుంది. స్వామికి ఆంతరంగిక భక్తుడైన కవి మాత్రమే ఇలా చనువుగా అడుగగలడు. "నాకా తోచదు, నీవు చెప్పవనుకో నాకింక

దిక్కేమిటో'' అనే ప్రశ్నతో ప్రారంభించి ''సాకుల్ చెప్పక చేదుకొమ్మనెద'' అనే విన్నపంతో పద్యాన్ని ముగించిన తీరు ముచ్చటగా ఉంది. "వేలాది కోరికలతో నిన్ను విసిగించలేదు కదా" "సందేహమ్ములు లేని భక్తి నిడుము..." అని చేసిన ప్రార్థన భక్తకోటికొక ఆదర్శం. "గోటన్ ద్రుంపితివంట ధాత శిరమున్ కోపించి దుశ్చేష్టకున్, చేటున్ గూర్చెడు వాని వ్రాత తుడుపన్ చేయేల రాకున్నదో" అన్న తార్కికమైన ప్రశ్న సంధించి, భక్త రక్షకుడైన స్వామి మనస్సును చూరగొనే ప్రయత్నం చేసారు ఈ కవి.

గంగను, నెలవంకను తలదాల్చి, గరళాన్ని, అగ్నిని కంఠంలో దాచుకున్న స్వామి కారుణ్య స్వభావాన్ని ఈ కవి చిత్రించిన తీరు నిరుపమానము. స్వామికి "స్థాణుడు" అని పేరు. కదలకుండా పాషాణంలా ఉన్నాడనుకుంటే చాలదు."స్థ అణుః" అని విభాగం చేసుకుంటే, అణు రూపంలో అంతటా నిండివున్న తత్త్వానికి "స్థాణువు" అని పేరు. అంతటా తానే నిండి ఉన్న కారణంగా ఇక ఎక్కడికి కదులుతాడు స్వామి? ఈ భావాన్ని ఈ కవి ప్రతిపాదించారు చూడండి "ప్రాణేశా జగమంత నీవె యగుటన్ బాహ్యాంత రంగంబులన్ 'స్థాణో'యంచును కొల్తుమే..." అనే పద్యంలో. మంత్రోచ్ఛారణలు, మడితడులు, ఆచారములు తాను పాటించలేను అంటున్నారు కవి. నా పూర్వ పుణ్య ఫలముగా ఈ మహనీయుడితో నాకున్న సాన్నిహిత్యం వల్ల ఈ మాట నమ్మలేను నేను. అయితే, ఎందుకిలా అంటున్నారో పద్యం చివరిదాకా చదివితే తెలిసింది. "నిన్ తలతు నీశా.." స్మరణ మాత్రం చేతనే అనుగ్రహించే స్వామివి నీవని నా ధైర్యం.. అంటున్నారు కవి. ఆచార సంప్రదాయాలకన్నా అంతరంగంలోని అచంచల భక్తి మిన్న అని కవి భావన. ఈ పద్యం లోని "భయహరా" సంబోధన సార్థకం, సాభిప్రాయం, సందర్భోచితం.

షట్చక్ర యోగ సాధనలో తనకు కలిగే అనుభూతిని "మూలాధారము నీవె... చాలున్ నా కమృతాభిషేకము.." ననే పద్యములో అభివ్యక్తం చేశారు కవి. "మేఘమ్మై జలమూర్తివై.." అనే పద్యంలో పరమేశ్వరుని "అభవ" రూపాన్ని వర్ణించిన తీరు "బ్రహ్మానంద మందిం'చక మానదు. ఉపవాసాలు, అభిషేకాలు, బిల్వ దళార్చనలు చేసి, భక్తులు పరమేశ్వర కృపకు పాత్రులు కావాలని ఆరాట పడుతూ ఉంటారు. అయితే, ఉపవాసం అంటే ఆహారం మానివేయటమని అనుకుంటూ ఉంటారు. మారేడు పత్రిని కుమ్మరించటం బిల్వార్చనం అనుకుంటారు. ఆ క్రియాకలాపాల ఆంతర్యం తెలుసుకోలేక పోతే, ఫలితం లేదు కదా! అంతరార్థాన్ని అందంగా అందించారు కవి.

"సత్యంబౌనుపవాసమన్న చెడునాస్వాదింప పోకుండుటే
సత్యంబౌనభిషేకమన్న నిను హృత్సంపూర్ణమౌ చింతనే
సత్యంబౌ త్రిదళార్చనన్న గుణముల్ సత్వాదులర్పించుటే
సత్యంబీగతి నర్చజేయ శుభమీశా భక్త కల్పద్రుమా"

ఈ శతకంలో ఎక్కడా పరమేశ్వరుని సగుణ రూప ప్రసక్తి కన్పించదు. తత్త్వ దృష్టికే ప్రాధాన్యమిచ్చి ఆలోచనామృతం అందించారు కవి. ఆత్మాశ్రయ భావాలతో ఆర్తిని వెల్లడించారు. సన్మానాలు, ప్రశంసలు, స్తోత్రాలు ముక్తి హేతువులు కాజాలవని, ఆ సత్యాన్ని మనస్సులో "రూఢి" చేసి, "జన్మన్ సార్థకమొంద సాయపడు" మని దైవాన్ని ప్రార్థిస్తున్నారు కవి. సృష్టి స్థితి లయ, తిరోధాన, అనుగ్రహాలు అనే పంచ కృత్యాలను అవలీలగా నిర్వహించగల స్వామి తనకు ఎన్నడు దర్శనమిస్తాడో... అన్న జీవుని వేదన ఈ శతకంలో గోచరిస్తుంది. ఈ కవి కోరికలు పవిత్రమైనవి. ఆదర్శమైనవి.

బుద్ధిన్ వక్రత లేమియున్, వినయమున్, భోగాదులన్ త్యాగమున్,
సిద్ధుల్ కోరక యుండుటన్, సమతయున్, శ్రేష్టత్వమౌ సాధనల్,
వృద్ధిన్ పొందగ భక్తి భావనలనీవే తీవ్రమోక్షేచ్ఛయున్
శ్రద్ధాసక్తులు నీ పదార్చనలనీశా భక్త కల్పద్రుమా

అన్న కోరిక కవి సంస్కారానికి సంకేతం. తన్మాత్రలు, మనస్సు, దేహము, అన్నీ జడమేనని, శివుడే చైతన్యమని గుర్తించి సమర్పణ భావముతో ఆరాధించే జ్ఞానమ్ ప్రసాదించమని కవిగారి అభ్యర్ధన. చెట్టే గానీ వేళ్ళు కనిపించవు. ప్రపంచమే కానీ పరమేశ్వరుడు కన్పించడు. కనిపించని పరమాత్మను తత్త్వ విచారణ ద్వారా జీవుడు గుర్తిస్తాడు. రాగద్వేషాలు, మోహపాశాలు జీవుణ్ణి దేహమనే కారాగారంలో బంధిస్తున్నాయని, సంసార సాగరాన్ని దాటించే నావ ఆత్మ విచారణ అని, నమ్మిన కవి ఆ నావను సంపాదించేందుకు పొందే తపన ఈ శతకములో గోచరిస్తుంది.

శబ్దార్థములు, పాండిత్యం అక్కరకు రావని, మనోలయమైపోయిన మౌనమే శరణ్యమని కవి అనుభూతి ప్రదంగా ఆవిష్కరించారు. సంసార వ్యామోహమనే గరళం తొలగించగలవాడు పరమేశ్వరుడొక్కడే అని, భవరోగములను ఉపశమింప చేసే వైద్యుడు శివుడేనని, ఈ కవికి గల దృఢ విశ్వాసం కవితలుగా రూపొందింది ఈ శతకములో.

సార ఫలరసాల కన్నా నీరు, వన్నెల పుష్పాలకన్నా తుమ్మి పూలు ఇష్టమైన స్వామి తన పద్యాలను స్వీకరిస్తాడనే నమ్మకంతో ఈ శతకాన్ని ముగించారు కవి. తన కవిత సాధారణమైనది మాత్రమే నన్న వినయ సంపదను ఈ సందర్భములో కవిలో చూస్తాం మనం. ఈ శతకములో పద్యం నడక, శైలి, ధార, శయ్య మొదలైన అంశాలను

చెప్పవలసి వస్తే ప్రతి పద్యమూ ఉదహరించ వలసినదే. “బాహ్యాభ్యంతర లోకముల్ బ్రతుకుటే భావ్యంబుగా నెంచుచున్”.. “ తండ్రీ నిన్నొక కుంచమో, కుచమనో ధ్యానింప మోకాటిలో”.. ‘‘దీక్షాబద్ధుడ స్వస్వరూపవెరుంగన్ దివ్యత్వ సంప్రాప్తమౌ”...”పర్యంకంబున పత్నినుంచుకుని ఆ పార్శ్వంబులన్ పుత్రులు”...సర్వోత్కృష్టము స్వాత్మ చింతన సరే సాధ్యమ్మె మా కెల్లడన్”...”దుర్వ్యామోహము దుఃఖ హేతువగుచున్ దుస్సాధ్యమై తోచురా”.. “జల్పంబే బహు జన్మలెత్తిన స్వాధిష్టానమ్ము నీవన్నచో” మొదలైన పద్యాలలో యతి ప్రాసలు సాగిన తీరు ఆశ్చర్యకరముగా ఉంటుంది. ఏ పద్యములోనూ ఈ కవి యతి ప్రాసల కోసం పదాలు వెతుక్కున్న జాడ కనిపించదు.

“ఆదిక్షాంత సమస్త శబ్ద చయమై..” వంటి సమాసాల ప్రక్కనే “ నాకా తోచదు, నీవు చెప్పవనుకో..” వంటి నుడికారపు సొగసులు కవి భాషా పటిమలోని వైవిధ్యాన్ని నిరూపిస్తూ అద్భుతావహంగా ఉన్నాయి.

ఇలా సాగిన ఈ ‘భక్త కల్పద్రుమం” సారస్వతలోకంలో అక్షరమై నిలుస్తుందని, అభవుని అమృతాశీస్సులు పొందుతుందని అనటం అభిమాన పూరితం కావచ్చునేమో గానీ అసత్యం మాత్రం కాదు.

భక్తి పద్య పుష్పాలతో పరమేశ్వరార్చన చేసే ఈ కవికి ఐహికాముష్మిక సంపదలను ఆ స్వామి అనుగ్రహించాలని ఆక్షాంక్షిస్తున్నాను... మరిన్ని మంచి రచనలు మాకు అందుతాయన్న స్వార్థంతో...

విజయవాడ “ఆర్షవిద్యాసాగర ”, “మధుర భారతి”

తేది-03.02.2017 **మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి**

# రసాభిషేకం

అనుకున్నట్టే నా ఆశ ఫలవంతం అయింది. అద్వైత భావానువర్తి, ఆర్షవిద్యాభ్యసన తత్పరులు అనుష్ఠానైక జీవన పరాయణులు అపర శంకర శంకరాచార్య పదపద్మమరంద పానాసక్తులు అమ్మ భక్తులు శ్రీ అనంత కృష్ణ గారు వేసిన "నారు.. మంచి" ద్రుమమై భక్త కల్పద్రుమమై, శతఫలాలను రసప్రపూర్ణముగా అందించింది. అదే ఈ "ఈశా భక్త కల్పద్రుమా" అనే మకుటంతో సాగిన శత పద్య సమన్విత సరస సాహిత్య కల్పభూజము. శ్రీమచ్ఛంకర భగవత్పాదులు పంచాయతన పూజావిధానంతో మన ఆధ్యాత్మిక విధానాన్ని సమన్వయ పరచిన సంగతి ప్రపంచ విదితమే.

ఒక్కొక్క దైవాన్ని ఒక్కొక్క పద్య ప్రసూనముతో అర్చించే ఆలోచన అంతర్లీనముగా ఉన్న అనంతకృష్ణ గారు పంచాయతన పూజా పరిసమాప్తికి అందించిన అర్చనా శతపుష్ప సమాహారం ఈ పొత్తము. బహుళ గ్రంథ రచన కావించిన ఈ కవికి భావ పరిపుష్టి, ధారా శుద్ధి, పద్య రచనా పాటవము ఉన్నాయని నేను చెప్పడం సూర్యుని చిరుదివ్వెతో చూపడమే అవుతుంది.

ఈ శతక మకుటం సార్థక సంబోధన. భగవంతుని కట్టి పడవేయడమే. "స్వామీ.. నీవు భక్త కల్పద్రుమానివి. నేను భక్తుడను. నేను కోరిన కోరికలన్నీ తీర్చవలసిన బాధ్యత నీదే సుమా! ఇన్ని మార్లు నిన్ను పిలిచి నేను కోరే కోర్కులన్నీ ధర్మబద్ధములు మాత్రమే" ఇది ఈ శతకాన్ని చదివే ప్రతి పాఠకునికి కలిగే భావన.

శతకాన్ని శ్రీ కారంతో ఆరంభించి సంప్రదాయాన్ని గౌరవించిన ఈ కవి "ఈశా భక్త కల్పద్రుమా" అని పద్యాన్ని పూర్తి చేయడంలో "ఈశా" లోని "శా" తో యతి మైత్రి పాటించవలసి ఉంటుంది. ఈ మాదిరిగా వంద పద్యాలనూ "శా" తో మైత్రిగల

పదాలతో చివరి పాదం ఆరంభించవలసినదే. ఇది ఒకరకంగా తనను తాను బంధించుకోవడమే. అయినా ఇలా యతి మైత్రి ఉండవలసిన మకుటాలతో ఇతః పూర్వం ఈ కవి శతకాలు వ్రాయడం మనం ఎరిగిఉన్నదే. మొదటి పద్యంలోనే "ఆశుతోషుడవే" అనే పద ప్రయోగం చేసిన కవి గడుసరి. ఈశ్వరుని ఎన్నెన్నో పేర్లతో విశేషణాలతో పలుకరించ వచ్చు. కాని ఆశుతోషుడు అనే పదం ఈశ్వరునికి మాత్రమే రూఢి. ఈ శబ్దానికి "వేగంగా సంతోషించేవాడు" అని అర్థం. మిగిలిన దేవతలను పూజించినంత విశేషముగా, విస్తారముగా పూజింపక పూర్వమే చిన్న సేవకే సంతోషించే పెద్ద మనసున్న దేవుడవయ్యా అని స్వామివారిని కీర్తిస్తూ మొదటి పద్యంలోనే శివుని శీఘ్ర ఫలదాయిగా పేర్కొంటే శివుడు అంగీకరించి తీరాలి కదా! ఆశ్చర్యం ! అనిపించింది. స్వామిని అర్థించడం కూడా తెలివితేటలతో చేయాలని.

"శ్రీమాతార్థము" అనే 3 పద్యము భావగాంభీర్యంతో సొగసులీనుతుంది. ఈశ్వరుడు, మౌని వాగ్వరుడుకూడా. ఈయన భిక్షాటన చేస్తాడు. కానీ భక్తులకు శ్రీలివ్వగలవాడు. ఈయన కామారి. కానీ గౌరిని శరీరంలో ఒక భాగంగా చేసుకొన్న ప్రేమాన్వితుడు. ఈయన విషభోక్త కానీ శాశ్వతుడు. జంగముడైన ఈ స్వామి సుస్థిరుడు కూడా. ఇలా ఉన్న నిన్ను- మనసుకు మాటకు చేష్టకు అందని నిన్ను- పూజించటం ఏ జన్మ పుణ్యమో కదా- విరుద్ధ లక్షణాలు ఒకే స్వామిలో నిండి ఉండటం సర్వశ్రేష్ఠునకు తప్ప సాధ్యం కాదు గదా. సంధ్యా నృత్యం చేసే వేళ నవ పంచవార నినాదిత ఢక్కారవాన్ని వర్ణించే పద్యం పదవది. అకారాది క్షకారాంత అక్షరాలుగా, అద్వైత వేదాంతంగా, నాట్య లక్షణాలుగా, ఇంతమందికి ఇన్ని విధాలుగా వారి వారి బుద్ధిగరిమను బట్టి ఆ శబ్ద చయం వినిపించిందట. అ ఇ ఉణ్ అని పాణిని మహర్షి, వేదనాదమని

ఋషులు, మునులు, వేదాంతమని అద్వైతులు, నాట్య శాస్త్రమని భరతాదులు భావించే శబ్ద చయాన్ని అందించిన అక్షర రూపా అంటూ పరమేశ్వరుని అభివర్ణించిన తీరు విజ్ఞుల హృదయాలకు విందొనరిస్తుంది.

విద్వత్కవి రచన విలక్షణంగా ఉంటుంది. విశిష్టంగానూ ఉంటుంది. ఈ రచయత విద్వత్కవి అని అందరూ ఇప్పటికే అంగీకరించి ఆనందంతో తల యూచారు. అష్టమూర్తిగా శివుని పేర్కొనడం వైదిక సంప్రదాయం. పంచభూతాలు, సూర్య, చంద్రులు, యజమాని అనేవారే ఆ అష్టమూర్తులు. 15వ పద్యంలో పంచ భూతములను పేర్కొంటున్నారు. జాగ్రత్తగా గమనిస్తే తప్ప ఆ విషయం అవగతం కాదు. "భూమిన్ చూడగ ఓర్పు కాంచితిని' అని ప్రారంభమౌతుందా పద్యం. ఓ స్వామీ భూమి నీరూపమే. నీ రూపమైన భూమిని చూచి సహన లక్షణము నేను నేర్చుకోవాలి అంటూ ఆ వాక్యంతో పద్యారంభం జరుగుతుంది. ఓర్పు భూమి నుండి నేర్చుకోవాలి సుమా! అంటూనే భూ స్వరూపమైన శివలింగం "కాంచి"లో ఉన్నది గమనించండి అంటూ భూమిని చూడగ ఓర్పు "కాంచి"తిని అన్న కవి నేర్పు. మిగిలిన నాలుగు లింగాల విషయం లోనూ అపహ్నవించే చూపుతారు కవి. అంబున జృంభ గాంభీర్యమన్నచోట సముద్రాన్ని చూచి గాంభీర్యాన్ని గ్రహించాలి అంటూ "అంబు" అనే శబ్దంతో జల లింగమైన "జంబుకేశ్వరాన్ని" "అరుణాగ్ని" అనే పదంతో అరుణాచలంలో అగ్ని లింగాన్ని, అన్నిటా వాయువున్న రీతిగా 'కాళేశా" అనే శబ్దంతో శ్రీకాళహస్తిలోని వాయులింగాన్ని, 'చిద్రూపంబు" అనే పదంతో చిదంబరంలోని అసంగత్వ లక్షణాన్ని చూపే ఆకాశ లింగాన్ని చూపుతారు కవిగారు. మనసు పెట్టి చూస్తే తప్ప గమనించలేని పంచభూత లింగాల దర్శనం మనకు లభించే విధం గా నిర్మించిన అసామాన్యమైన పద్యం ఇది.

ఔను మరి “ఎందెందు వెదకి చూచిన అందందే కలదు” కదా పరమాత్మ. అలా వెదకి చూస్తే ఈ పద్యంలో పంచలింగ దర్శనం అయితీరుతుంది.

ఓ స్వామీ, నీ శూలంలో మూడు మొనలు ఉంటాయి. అందుకే త్రిశూలాన్ని ముమ్మొన వాలు అని పేరు. త్రినేత్రాలతో నీవు త్రయంబకుడవు. నీకు మూడు దళాలున్న మారేడు దళం ఇష్టం. నా దగ్గర కూడా మూడే ఉన్నాయి. మూడు సంఖ్య నీకు ఇష్టం కదా. ఓ త్రిపురారీ! నా వద్ద ఉన్న మూడు –సత్వ రజస్తమో గుణాలు– అవి నీకిచ్చేస్తాను. ఓడబాటు మాట ఏమిటంటే నా సత్వరజస్తమో గుణాలనే మూటిని నీకిస్తున్నాను కాబట్టి భక్తి జ్ఞాన వైరాగ్యాలను మూడింటిని నాకియ్యవా అంటూ పదహారవ పద్య రచన పరమాద్భుతం అందున్న కొస మెరుపు “భక్తి జ్ఞాన వైరాగ్యములు జాలిన్ నాకొసగన్ సదా కొలుతునీశా భక్త కల్పద్రుమా” అనడం. ‘జాలిన్ నాకొసగన్’ అన్నమాట ఎంత ఆర్ద్రంగా ఉంది ? !.

17 వ పద్యంలో కవిగారి గీర్వాణాన్ని గమనించవచ్చు. పద్యం ఎంత ధారగా సాగిందో శ్లోకం కూడా తత్సమాన రసధారతో సాగడం గమనించండి. విశేషమేమిటంటే సంస్కృత శ్లోకంలో ప్రాసను యతి మైత్రిని పాటించనవసరం లేదు కానీ తెలుగు పద్యం నియమాలన్నీ పాటించారు కవి శ్లోకంలో కూడా. ఈ నా బొందిలో అంతరాత్మవై నీవే ఉండరా ఈశ్వరా అనే కోర్కె 21 వ పద్యం పరమేశ్వరుని ఏమి అర్థించాలో తెలియజేస్తుంది.

శతకం భక్త కల్పద్రుమమైన ఈశ్వరునిపై రచించినది. ఇతఃపూర్వ కవి నిర్మిత శివసాహిత్య సంబంధ బంధురం కాని హృదయంతో ఈ శతక రచనకు కవి సమకట్టలేదు. ముఖ్యంగా ఆది శంకరుల శివానందలహరి, వారి శతకంలో అందందునా ధ్వనిస్తూనే ఉంది. ‘గోటన్ త్రుంపితివంట’ అన్న 21వ పద్యం ఆది

శంకరుల సంస్కృత శ్లోకానికి అందమైన తెలుగు సేతగా సమ్మోదాన్ని కలిగిస్తుంది. 24వ పద్యంలోని అభావ, విభావ, ప్రభావ,స్వభావ శబ్ద ప్రయోగంతో పరమేశ్వర ప్రార్థన ఈశ్వరునే ఔననిపించేలాగా సాగింది.

కవులు నిన్ను తామస ప్రకృతిగా వర్ణిస్తారు. ఇది నిజమా,అనేలా నీ దక్షిణామూర్తి శాంత రూపం. లయకారకుడని వర్ణిస్తుంటారు కానీ నీ మార్కండేయ రక్షణ లక్షణం నిన్ను ఆది భిక్షువంటారు కానీ శ్రీమాత సర్వార్థ ప్రదాయినియై నీ శరీరార్ధంలో ఉంది కదా! ఇలా పూర్వ కవుల మాటలు పట్టుకుని నిన్ను తామసునిగా, లయకారునిగా, భిక్షువుగా భావించడం తప్పు సుమా అంటూ పరమేశ్వర గుణ సంపత్తిని హేతుబద్ధంగా వర్ణించిన 'చిత్రంబే' అనే 26 పద్యం మహా విచిత్రమైన పద్యంగా కన్పడుతూ శివుని దర్శింప చేస్తుంది.

శతక పద్యాలు సాధారణంగా భక్తి ప్రపూర్ణాలుగా ఆత్మాశ్రయ ధోరణిలో లోక వృత్తాన్ని ప్రశ్నిస్తు సాగుతూ ఉంటాయి. ఓ పరమేశ్వరా నీవే నాలో జీవమై శ్వాసగా ఉంటే నా కనులు సూర్యచంద్రులు, నా బుద్దులే గురు శుక్రులు, నా ఆగ్రహమే ఆ గ్రహమైన కుజుడు, నా పరాక్రమమే బుధుడు, నా మందత్వమే శని, లోకంలోని ఛాయలే రాహు కేతువులు కదా అని చెప్పిన 32 పద్యం ఆలోచించే కొలదీ ఆనందాన్ని పంచి ఇస్తుంది "నా కండ్లెన్నగ సూర్య చంద్రులు' అంటూ.

పరమేశ్వరుని విలాసాలలో త్రిపురాసుర సంహారం ఒక విశిష్టమైన ఘట్టం. మన దేహానికి అన్వయం చేసికొని శివుని మహా యోగీశ్వరునిగా ఉదాత్త భావ సమన్విత శివ భక్తులు భావిస్తూ ఉంటారు.

కార్తిక మాసం లో మనం నిర్వహించే జ్వాలా తోరణమ్ ఆ త్రిపురాసుర సంహారానికి ప్రతీకగా అభిజ్ఞులు అభిభాషిస్తూ ఉంటారు. త్రిపురాసుర సంహార సమయంలో ఈశ్వరుడు మేరువును ధనస్సుగా, వాసుకిని వింటి త్రాడుగా, మహావిష్ణువును బాణముగా భూమినే రథముగా చేసికొన్నాడని పురాణ గాథ. మూలాధారం నుండి సహస్రారం వరకు ఉన్న ఈ మేరువు అనే ధనువుకు, కుండలినీ అనే సర్పంతో సంధానిస్తారు. నా దేహమే తేరు. ఓ పరమేశా శత్రు సంహారం చేయ బయలుదేరు అని ప్రార్థించే 54వ పద్యం భక్తుల దేహాలతో పరమేశ్వర అభిన్నత్వాన్ని ఎలా దర్శించాలో చూపుతుంది.

పరమేశ్వరుడు నిష్కలుడు. నిరంజనుడు, నిర్వికారుడు. అరూపి. ఎంత ప్రార్థిస్తే ఆయన మనకు కనబడతాడు? ఆయన దర్శనం లభింపక ఈ భవసాగరంలో మునిగి తేలుతూ బాధలనందుతూ ఉంటాము కానీ నిజమైన ఈశ్వర భక్తులకు ఆ స్వామి తప్పక రూపసహితుడై కానవస్తాడు. ఆయన భవసాగరంలో ద్వీపంలా వచ్చి ఒడ్డుకు చేరుస్తాడు. “దైవం మానుషరూపేణ” అంటూ ఉంటాం కదా. దైవం గురు రూపేణ కానవస్తాడట. అందుకేనేమో ‘శివాయ గురవే నమః” అంటూ ఉంటాం. ఈ లోకంలో రూపం ఉన్న పరమేశ్వరుడే సద్గురువు అనే గురు ప్రభావాన్ని తెలుతుంది 65వ పద్యం.

ఈశ్వరుడు కైలాసంలో ఉంటాడు. జ్యోతిస్వరూపమై ఉంటాడు స్థలంలో ఉంటాడు, జలంలో ఉంటాడు, ఆకాశంలో ఉంటాడు అంటారు కదా. నిజానికి ఈ శిఖర, శైల, స్థల, జలాదులన్నీ “నాదు లోపటనే” ఉన్నాయి కదా. జాగ్రత్తగా గమనిస్తే నీవు నాలోనే ఉన్నావనే “కైలాసంబున” అనే 91 వ పద్యం ‘సోహం’ భావానికి దగ్గరగా ఉండి భక్తులైన వారికి ధైర్యాన్ని ఉత్సాహాన్ని

కలిగిస్తుంది. 98వ పద్యంలోని “దర్వీ పాక రసానుభూతి” అనే మాట కవి గొప్పదనాన్ని, శాబ్దిక జ్ఞానాన్ని, శాస్త్ర విషయ సార సంపన్నతను తెలియజేస్తుంది.

సహజముగా కవి ధ్యానమూర్తిని మనః ఫలకము మీద చిత్రించుకుని దాన్ని దర్శిస్తూ వుంటాడు. కానీ మంత్రమయ మూర్తిని దర్శించటం భక్తకవి చేసే పని. ఈ కవి భక్త కవి కాబట్టి మనమందరం చూసే మూర్తి కాకుండా, ఈశ్వర సంబంధమైన మంత్రాధిష్టాన మూర్తులుగా దర్శనం పొంది దాన్ని వ్యక్తం చేయడం ఈ శతకములో కన్పించే ఒక ప్రత్యేకమైన అంశం. ఇక సామెతలు నానుడులు తమ కవిత్వంలో పొదగటం బంగారు ఆభరణాలకు రత్నాలు, వజ్రాలు పొదిగినట్లని కవులందరి అభిప్రాయము. ఈయన కవిత్వములో నానుడులు, సామెతలు సహజంగానే పొదగబడ్డ ఆభరణాలు లాగా ప్రకాశిస్తున్న సంగతి లోనారసిన వారికి తెలుస్తుంది.

‘ఈశా భక్త కల్పద్రుమా” అనే శతకంలో కవి వ్రాసిన ప్రతి శతకాన్ని అధ్యయనం చేస్తే పంచాయతన పూజ పరిసమాప్తమై ఈశ్వర కృప ఫలవంతమౌతుందని నా హృదయానికి తోచిన భావన.

ఈశ్వరుడు అభిషేక ప్రియుడని ఆర్యోక్తి. ఈవిధంగా శతాధిక భావ సువర్ణ భాండాలతో ఈశ్వరునకు అభిషేకం చేస్తే పరమేశ్వరుడు పరమానంద భరితుడు కాడా! భక్త కల్పద్రుమం కాకుండా ఉంటాడా! ఇంకెందుకు ఆలస్యం. రసాభిషేకానికి సమాయత్తం అవుదాం.

తన్మే మనః శివసంకల్పమస్తు

బుధజన విధేయుడు

అవధాన రాజహంస, సహస్రావధాని

**కోట వేంకట లక్ష్మీ నరసింహం**

# సర్వం శ్రీ పరమేశ్వరార్పణమస్తు

నిరాకార పరబ్రహ్మము ప్రేమాస్పదమైన సాకార రూపాన్ని ధరించు క్రమములో రూపారూప స్వరూపమే లింగం. అది ఒక ఆలంబన మాత్రమే. మట్టితో చేసినా, వెండితో చేసినా, పాదరసమైన మరే వస్తువైనా అలాంటి లింగార్చన ధ్యానం మటుకు "ఆపాతాళ నభస్థలాంత భువన బ్రహ్మాండమావిస్ఫురత్..." అంటూ ఆ విశ్వరూప ధ్యానమే. కనబడునది అణువంత, ధ్యానించవలసినది మహత్తత్త్వాన్నే. పేర్లు ఎన్నైనా ఉన్నదొక్కటే చైతన్యము. ఈ విషయము పునః పునః గుర్తు చేసేందుకే పంచాయతనార్చన ఏర్పాటు చేసారు అపరశంకరులు ఆదిశంకరులు. ఆ విశ్వనాథుని అనుగ్రహము లేక పోతే చీమైనా కుట్టదంటారు. ఇక పద్య రచన గురించి వేరే చెప్పాలా? నేను వ్రాసాను అన్న అహంకారము నాకు లేదు. నాతో వ్రాయించాడు అన్న శరణాగతి తప్ప.

అర్హత ఉన్నా లేకపోయినా కొన్ని అదృష్టాలు కేవలం భగవంతుని అవ్యాజ కరుణా విశేషము చేత మనకి కలుగుతాయి. నాకు నా తల్లిదండ్రులు ద్వారా యీ జన్మ లభించటము, సద్గురువు లభించటము, సాధనా మార్గ ప్రవేశము ఇత్యాది. ఆ కరుణాంతరంగులకు అనేకానేక సాష్టాంగ ప్రణామములు. మరి ఈ ఉపాసనాక్రమములో తెలిసికొన్న జ్ఞానము రూఢి చేసుకోవాలంటే మూడు చెప్పారు... శ్రవణ, మనన, నిధిధ్యాసనములని. గురు శుశ్రూషయా విద్యా అన్నారు.. వారి అనుగ్రహముతో శ్రవణమైయ్యింది. మిగిలిన రెంటికొరకు నేనెంచుకున్నది పద్య రచన. వివేకచూడామణిలో అందరూ ఉటంకించేది "మోక్ష సాధన సామగ్రియాం భక్తిరేవ గరీయసీ" అని. అదేమిటో తరువాతి పాదం వదిలేస్తారు. "స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే" అని. ఈ స్వస్వరూపానుసంధాన యత్నమే ఈ పద్యరచనా వ్యాసంగము.

ఏమీ తెలియని నేను గురు సహస్రనామ స్తోత్రము వ్రాయుట చిత్రాతి చిత్రము. సంస్కృతము రాని నేను, నన్ను సంస్కరించు గురువుకి అర్పించిన మొదటి పుష్పమది. తరువాత అమ్మ పదాలు పట్టి గొల్చుకున్నాను "లలిత పదముల మది లలిత గొలుతు" అంటూ. తరువాత వరుసగా "వర సిద్ధి వినాయక భక్త పాలకా" అని గణనాధుని, "భాస్కరాదిత్య ఘృణి సంజ్ఞ భక్త వరద, దివసకర వరేణ్య సవితా తిగ్మ కిరణ" ని ఆదిత్యుని, "శ్రేయస్కరా శ్రీధరా" అని విష్ణుమూర్తిని, ఇదిగో ఇప్పుడు ఇలా "ఈశా భక్త కల్పద్రుమా" అని ఆ మహేశుని కొల్చుకునే అదృష్టం నాకు దక్కింది. దీనితో పంచాయతన పూజ పూర్తి అయినట్లే.

ఈ రచనా కాలంలో ఎన్నో ఎన్నెన్నో అనుభూతులు. ఎన్నో సందర్భాలలో పదాలో, పాదాలో, పద్యాలో అలా అసంకల్పితముగా దొర్లినవి. ఒక అనుభవము మాత్రము పంచుకోవాలని ఉంది. మన్మధ దీపావళికి రెండురోజుల ముందు సంగతి. ప్రతి కార్తీకమాసం ఖమ్మం శివాలయంలో పురాణ ప్రవచనం సాగుతుంది. శ్రీమాన్ కోదండరామాచార్యులుగారు ఫోనులో అడిగారు 'మీవద్ద ఉన్న వామనపురాణం పుస్తకంలో ఎన్ని అధ్యాయాలు ఉన్నాయి' అని. పుస్తకం చూసి చెప్పాను. అప్పుడు చూసాను కాకతాళీయంగా 'శివుడు కోపించి బ్రహ్మ శిరఃఖండనమొనరించుట' అన్న అంశం. మరిచిపోయాను. కానీ మనసులో అదే తిరుగుతున్నదేమో 'గోటన్ ద్రుంచితివంట' అన్న పద్యం అల్లాను. దానితో సహా కొన్ని పద్యాలు వ్రాసాను. దీపావళి నాడు అవధాన రాజహంస శ్రీ కోట వెంకట లక్ష్మీ నరసింహంగారికి వినిపించాను. ఆయన ఈ పద్యం విని 'నేను ఒక అరగంటలో మీకు మళ్ళీ ఫోను చేస్తాను మాష్టారూ' అన్నారు. చేసారు కూడా. 'అయ్యా శివానందలహరి 16వ శ్లోకం చూడండి అంటూ వారే చదివి వినిపించారు. దాని అర్థం అక్షరాలా నేను వ్రాసాననుకొన్న పద్య అర్థమే. వారన్నారు "నాకు శ్లోకం

ధారణలో లేదు అందుకే చూసి చదువుతున్నాను అని". శంకర భావం శంకరుడే నాయందు దయతో నాకు స్ఫురింపజేసాడనిపించింది. కళ్ళు నీళ్ళతో మసకబారాయి. వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. అనిపించింది అప్పుడు...' నేనా పద్యాలు వ్రాసేది...వాడు వ్రాయిస్తున్నాడు' అని. కాస్తోకూస్తో అహంకారము కర్తృత్వము ఉంటే పటాపంచలైపోయినాయి. ఈ ఆనందం ఎంతమందితో పంచుకున్నానో. ఇలా ఇందులోని ప్రతిపద్యమునకు ఒక అనుభవం చెప్పగలను. ఒకటి మాత్రము రూఢి. ఇందులో పద్యాలు వ్రాసినది నేను అనే ఈ రూపముతో నాలోని అసలు 'నేను' వ్రాసాడు. ఇందులో స్వకపోల కల్పనలు చేయలేదు. శాస్త్రమో, శాసనమో, ప్రమాణము లేనిది వ్రాయలేదు.

ఒక యజ్ఞములో యజమాని ఒకడైనా భాగస్వామ్యము ఎందరిదో.. హెూతా, ఉద్గాతా ఇత్యాది. అలాగే పుస్తకం నేను వ్రాసానని జబ్బలు చరుచుకున్నా, అందుకు ప్రత్యక్ష, పరోక్ష సహకారాలు అందించిన వారు ఎందరో... నా ధర్మ పత్ని వనజ కానీయండి, పిల్లలు వారి అర్ధభాగాలు వారి పిల్లలు కానీయండి, పద్యరచనలో మెళకువలు చెప్పటమే కాకుండా దానిలోని మంచి చెడుగులను చూపిన ఆప్తులు, సర్వశ్రీ 'చిత్ర కవితా సమ్రాట్ చింతా రామకృష్ణారావుగారు, అవధాన రాజహంస, సహస్రావధాని కోట వెంకట లక్ష్మీ నరసింహం గారు, ప్రముఖ పౌరాణికులు మల్లాది రామనాథ శర్మగారు, ఆప్తమిత్రులు కేశిరాజు కామేశ్వరి సార్, మారేపల్లి వెంకటరమణ పట్వర్ధన్ గార్లు... వీరందరకు సర్వదా కృతజ్ఞుడను. అన్నింటికి మించి నాకు నా నాలుగో క్లాసులోనే ఛందస్సు నేర్పి, తొలి ఉత్పలమాల పద్య రచనకు ప్రోత్సహించిన మా లక్ష్మీపతిరావు సారుని తలుచుకోకపోతే పెద్ద దోషమౌతుంది. వారే నాకు పద్యరచనకు స్ఫూర్తి.

అమ్మవారి శతకానికి ముందుమాట నా దీక్షాగురువులు అనుగ్రహించారు. అదే ఈ శతకానికి కూడా ముందుమాటగా భావిస్తున్నాను. ఈ పద్యాలు ఓపికగా చదివి తమ అమూల్య అభిప్రాయాలు ముందు మాటలు వెలయించిన బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారికి, బ్రహ్మశ్రీ కోట వేంకట లక్ష్మీ నరసింహంగార్లకు సాశ్రుపూర్ణ నయనాలతో నమస్సులు మాత్రం తెలియజేసుకుంటున్నాను. ఇక్కడ మరొక్క విషయం చెప్పాలి. నా మిత్రులొకరు ఒకనాటి రాత్రి ఫోను చేసి "ఇప్పుడే మీ శ్రీధర శతకం చదివాను. మీరు మరొక శతకం వ్రాస్తున్నాని అన్నారు అందులో. దాని ముద్రణావ్యయం నేనే ఇస్తాను. కాదనవద్దు" అన్నారు. నేను ఆ విషయం మరిచిపోయాను. ఇదిగో ఈ మధ్యనే మళ్ళీ కలిసినప్పుడు "నా కన్యాదాన ఫలం ఎప్పుడు దొరుకుతుంది. మళ్ళీ చెప్పలేదేమిటి." అంటూ అడిగారు. నాకైతే వారి పేరు వ్రాయలని ఉందికానీ వారి కోరిక మేరకు ఆ గుప్తముగానే ఉంచుతున్నాను. వారికి వారి కుటుంబ సభ్యులకు సర్వశ్రేయస్సులు ఆ పరమేశ్వరుడు సమకూర్చుగాక. కాయితాల పై వ్రాయటం సరే పుస్తకమెలా.. శ్రీ పర్ఫెక్ట్ గ్రాఫిక్స్ కి వెళ్ళటమే. మా మధు ని మయబ్రహ్మ అంటే అతిశయోక్తి కాదు. యజమాని శ్రీ రవీంద్ర సాయి గారు వచ్చి అన్నీ నిశితంగా పరిశీలించి చేసే అతిచిన్న మార్పులతో గొప్పగా మారిపోతుంది. అదిగో వారి బృందమంతటికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

శివునికే రూఢ్యర్థమున ప్రయోగించే పేరు 'ఆశుతోషుడు'... అల్పసంతోషి....పైగా తనను తాను ఇచ్చేసుకునే భక్తవరదుడు. అందుకే 'ధ్యాయేదీప్సిత సిద్ధయే ధ్రువపదం..." అంటూ నా యీ తుమ్మి పూల దండ ఆయన పాదాల వద్ద సభక్తికముగా సమర్పించుకునే వరం ప్రసాదించాడు. అంతా అమ్మదయ......

గురుపాదధూళి

హేమలంబ శ్రావణం
06.08.2017

**నారుమంచి వేంకట అనంత కృష్ణ**

శ్రీభావార్థము వేద సూచితమునై చిచ్ఛక్తి తేజంబునై
యే భావమ్మున కొల్చినన్ మురియుచున్నీడేర్చగా కామనల్
శోభామూర్తిగ నాకృతిన్ గొనుటచే చోద్యంబు నాకయ్యెడిన్
స్వాభావమ్ముగ నాశుతోషుడవె యీశా భక్త కల్పద్రుమా! 1

యుక్తాయుక్త విచారణల్ విపులమౌ యోగాది విన్యాసముల్
నక్తాదుల్ జప హోమముల్ చదువులున్ స్నానాదులున్ యాత్రలున్
రిక్తంబైనను ముక్తి నిత్తువుకదా శ్రీకాళహస్తీశ యా
సక్తిన్ తిన్నని భక్తి కల్గునెడనీశా భక్త కల్పద్రుమా! 2

శ్రీ మాతార్థము మౌన వాగ్వరుని సుశ్రీలిచ్చు భిక్షాటకున్
కామారిన్ గిరిజా మనోజ్ఞు విషభోక్తన్ శాశ్వతున్ భక్తిమై
యీ మా జంగమ సుస్థిరున్ కొలుచుచోనేజన్మ పుణ్యంబహో
స్వామీ నిన్నిక వీడకుండ గనుమీశా భక్త కల్పద్రుమా! 3

శిక్షింపన్ స్వపరంబులేమి సమదృష్టిన్ చూడ దక్షాధ్వరిన్
రక్షింపన్ స్వపరంబులేమి నినె యారాధింతురే రాక్షసుల్
పక్షంబెన్నవు బంధమెన్నవు గదా పాలింపగా ధర్మమున్
సాక్షీమాత్రమె సంఘముల్ కనగనీశా భక్త కల్పద్రుమా! 4

ఈశా భక్త కల్పద్రుమా

నా పై నీ యనుకంపనేమనియెదన్ నా కండ్ల నీరాయెనే
నీ పై పద్యములల్లుటన్న మిషతో నిన్నాడగా నిత్యమున్
ప్రాపున్ నిల్చియు తత్త్వసిద్ధి కలుగన్ భావంబులన్ జూపుచున్
స్థాపింపన్ హృదయంబునన్ సతతమీశా భక్త కల్పద్రుమా! 5

సోమాయంచు నమస్క్రియల్ సలుపు నీ స్తోత్రాలు రాకున్నవే
యీ మాయన్ బడి లంపటంబనక నేనీదన్ భవాంభోనిధిన్
ప్రేమార్ద్రంబుగ చూడరా తొలగులే భీతుల్ సమూలమ్ముగా
సామాన్యంబుగ గాతువే బుడతనీశా భక్త కల్పద్రుమా! 6

లోలో చూడగ నీవనన్ సకలమౌ లోకంబులన్నీవనన్
కాలంబావల నీవనన్ గన నిరాకారంబు సాకారమౌ
నీ లీలల్ తెలియంగ జాలనిక నన్నేరీతిగా బ్రోతువో
చాలింపన్ దగు శోధనల్ శరణమీశా భక్త కల్పద్రుమా! 7

బాహ్యాభ్యంతర లోకముల్ బ్రతుకుటే భావ్యంబుగా నెంచుచున్
దహ్యంబందని రీతి కంఠముననే దాచేవు పాషాణమున్
గుహ్యంబైనది సుద్ది చెప్పెదనయా గుర్తించితిన్ సూత్రమున్
సహ్యంబవ్వని వాని దాచు విధినీశా భక్త కల్పద్రుమా! 8



నిన్నర్చింపగ నేను నీవవవలెన్ నిన్నుంచి నా యంతటన్
భిన్నంబెన్నడి భావమే లయముగాన్ వేరౌచు నేనుందునే
నిన్నర్థింతును నా యెడన్ కృపగనన్ నిర్వీర్యతల్ బాయుచున్
సన్నద్ధంబగు చేష్టలన్ తెలుపుమీశా భక్త కల్పద్రుమా! 9

ఆదిక్షాంత సమస్త శబ్ద చయమై అద్వైత సిద్ధాంతమై
వేదార్థంబటు, నాట్య లక్షణమటున్ విఖ్యాతమౌ సూత్రముల్
తాదాత్మ్యమ్మున విన్నవారి గరిమన్ తల్లక్ష్యమై తోచుచో
స్వాదున్ గూర్చెను నీదు ఢక్క రవమీశా భక్త కల్పద్రుమా! 10

నేనెవ్వాడను పుట్టు పూర్వమెరుగన్ నేనెందు పోజాలెదన్
నేనే చేతల దోష సంచితమనన్ నీ నుండి వేరందురే
నీ నా భేదము లేశమైన మిగులన్ నేనెట్లు నీవౌదునో
స్థానంబిమ్ము సుఖమ్ము నిత్యముగనీశా భక్త కల్పద్రుమా! 11

నాలో నాడులు నాగ భూషలనగా జ్ఞానాక్షి కామారియౌ
నాలో చిత్కళ శక్తిగాగ శశియే నాకున్ సహస్రారమై
నాలో తంత్రులిడా త్రయమ్మై త్రిపథా నాస్వామి నీవోలెనే
స్థాలీపాకపు న్యాయమట్లు కననీశా భక్త కల్పద్రుమా! 12



అర్థంబై పురుషార్థమౌ ప్రకృతి తానై తోచునన్యంబునై
అర్థంబౌటకు నర్ధభాగముగ మా యమ్మౌచు కన్పింతువే
అర్థింతున్ సకలంబు నీవెయని నాకర్థంబు కానిమ్మనిన్
స్వార్థంబెన్నగ నిన్ను సాంబ యననీశా భక్త కల్పద్రుమా! 13

ఇమ్మా సాత్విక భావనల్ ప్రబలమౌ యిక్కట్లు పోనాడి రా
నిమ్మా తాత్విక చింతనల్ సఫలమై యీడేర్చగా కామనల్
కొమ్మా రాజస తామసాది గుణముల్ క్రోధాదులన్ శీఘ్రమే
సమ్మానింతు హృదిన్ సదా నిలిపి యీశా భక్త కల్పద్రుమా! 14

భూమిన్ జూడగ నోర్పు కాంచితిని అంబున్ జృంభ గాంభీర్యమున్
కైమోడ్తున్ అరుణాగ్ని తేజమనగా కాళేశ సర్వంబునన్
తామా వాయువు నుంచుటన్ కనగ చిద్రూపం బసంగత్వమున్
స్వామీ సాధక లక్షణంబనగనీశా భక్త కల్పద్రుమా! 15

శూలంబో కనులందువో దళములో సూచించు త్రిఃపూర్వమై
మేలున్ గూర్చ గుణత్రయం బొసగెదన్ మీ వద్ద శోభించులే
ధీ లక్ష్యంబుల వృద్ధికై త్రికము భక్తి జ్ఞాన వైరాగ్యముల్
జాలిన్ నాకొసగన్ సదా కొలతునీశా భక్త కల్పద్రుమా! 16



ఆశాపాశమనేక దోషసహితం అజ్ఞానజం కంటకం
క్లేశోత్ప్రేరక  బంధురం రిపుసమం కేనాపి నాపేక్షితం
హే శంభో హర తన్నివారయ విభో హృద్దేశ సౌఖ్యాయ మే
సౌశీల్యాది గుణాశ్రయం దిశతు ఈశా భక్త కల్పద్రుమా! 17

మాయావస్తు సమూహ మధ్యగతమౌ మాబోంట్ల రక్షింపవే
హేయంబైన పదార్థ దృష్టి తొలగన్నేరీతి సాధించుటో
మాయందార్తి నెరింగి తెల్పగదవే మమ్ముద్ధరింపంగదే
సాయంబీయగ చేయి జాపుమికనీశా భక్త కల్పద్రుమా! 18

నాకా తోచదు నీవు చెప్పవనుకో నాకింక దిక్కేమిటో
లోకాలోకన మోహ హేతువగుటన్ లోపింప నాత్మార్థముల్
మాకింకెవ్వరు దిక్కు నీవె కదటో మమ్మేల రాకుంటివే
సాకుల్ చెప్పక చేదుకొమ్మనెద నీశా భక్త కల్పద్రుమా! 19

తంత్రీ నిన్నొక కుంచమో కుచమనో ధ్యానింప మోకాటిలో
గుండ్రాయందుననో మరే యితరమో కొల్వంగ రాకున్నదే
పుండ్రంబుల్ శుభ చిహ్నముల్ తెలుపుచున్ పూర్ణార్ధ రూపంబుతో
చంద్రాగ్నిన్ దహియింప కర్మచయమీశా భక్త కల్పద్రుమా! 20

వందల్ వేలుగ కోర్కెలన్ దెలిపి నీవంతింక దీర్పందగున్
చెందున్ నీకె యటంచు పల్కితినటో చేకొంటి నిన్నంచునా
బొందిన్ నిల్వగ నొక్కటే వరమిడన్ పొల్పార పూజింతురా
సందేహమ్ములు లేని భక్తినిడుమీశా భక్త కల్పద్రుమా! 21

గోటన్ ద్రుంపితివంట ధాత శిరమున్ కోపించి దుశ్చేష్టకున్
చేటున్ గూర్చెడి వాని వ్రాత తుడుపన్ చేయేల రాకున్నదో
ధాటిన్ తాళగ లేను దారి కననే తప్పింప రావేమి నీ
సాటెవ్వారలు భక్త రక్షణకునీశా భక్త కల్పద్రుమా! 22

నీవే నేనని నేను నీవగుటకై నిన్నట్లు భావించెదన్
రావా నిల్వగ నవ్విధమ్ముగ ప్రభూ రాజిల్లెదన్నీవ యై
నావాడంచును నమ్మిపిల్తు నినునే న్యాసంబొనర్తున్ సదా
శైవంబైన విధమ్మిదే యనగనీశా భక్త కల్పద్రుమా! 23

కోపావేశమభావ ధర్మమగుచో కొల్వంగ సాధ్యంబగున్
సోపానంబు విభావ ధర్మమగుచో శోధించుచున్ సాగుచో
నీ పై భక్తి ప్రభావ ధర్మమగుచో నిన్నింక నాయీ హృదిన్
స్థాపింపంగ స్వభావ ధర్మమగునీశా భక్త కల్పద్రుమా! 24

దీక్షాబద్ధుడ స్వస్వరూపమెరుగన్ దివ్యత్వ సంప్రాప్తమౌ
మోక్షాపేక్షయె లక్ష్యమై చెలగగా ముద్దార నిన్గొల్చెదన్
ప్రక్షాళింపుము పాపరాశి త్రుటిలో పాలింపవే చూడకో
సాక్షీమాత్రుడనంచు తప్పుకొననీశా భక్త కల్పద్రుమా ! 25

చిత్రంబే నిను తామసుండనుటయా శ్రీదక్షిణామూర్తివే
చిత్రంబే లయకారకుండన చిరంజీవిత్వమున్నిత్తువే
చిత్రంబే నిను భిక్షకుండనుటయా శ్రీమాత సర్వార్ధమే
క్షాత్రంబే నిను నిందజేయుటననీశా భక్త కల్పద్రుమా ! 26

పాపోన్మూలిని గంగయున్ శశియుకన్పట్టంగ చూపెట్టుచున్
తాపోత్పాదకమగ్నినిన్ విషమునున్  దాచేవు లోలోపటన్
నాపాలిన్ దయ తోడ నేర్పుటకదా నా సౌఖ్య దుఃఖాదులన్
స్థాపింపన్ దగు స్థానముల్ సతతమీశా భక్త కల్పద్రుమా! 27

నీకున్ వారికి భేదమా హరహరా నీవే కదా వారనన్
నాకేనాటికి తోచునో తెలుపవే నన్నెట్లు  రక్షింతువో
నీకాకారము కోసమై గురువుగా నీ మంత్రమే తానుగా
సాకారంబగు దేశికున్ కొలుతునీశా భక్త కల్పద్రుమా ! 28

ప్రాణేశా జగమంత నీవె యగుటన్  బాహ్యాంతరంగంబులన్
'స్థాణో'యంచును కొల్తుమే, కదలగా సామర్థ్య లోపంబు ని
స్త్రాణుండంచును పల్క దోషము కదా! సర్వాత్మ చైతన్యమున్
'స్థాణో' యన్న జడమ్ముకాదు కద యీశా భక్త కల్పద్రుమా!   29

మంత్రోచ్చారణ కర్తతల్ మడితడుల్ మన్నింపులెన్నెన్నియో
యంత్రారాధన కన్నియే నియమముల్ యత్నింప నాకౌనొకో
తంత్రోపాసన చేయగా  భయహరా ధైర్యంబు నీవుంటయే
సంత్రాణంబొనరింప 'నిన్' తలతునీశా భక్త కల్పద్రుమా!   30

మౌనంబెంతటి కష్టమో తెలిసెరా మాటాడునే మానదే
యీ నా 'వైఖరి'నాపినన్ పలుకునే యే మూలనో శబ్దముల్
లోనున్నావని నీకు తెల్పితిని మేలున్ కూర్చ జాగేల హృత్
స్థానంబందున నుండియున్ తగునె యీశా భక్త కల్పద్రుమా!   31

నాకండ్లెన్నగ సూర్యచంద్రులగుచో నా బుద్ధులే యొజ్జలౌ
నాకోపమ్మె కుజుండు సౌమ్యశనులౌ నా వీర్యమందత్వముల్
లోకచ్ఛాయలు రాహుకేతువులు, నాలో జీవమై శ్వాసవై
సాకారంబుగ సంచరించు నెడనీశా భక్త కల్పద్రుమా!   32

నిల్వన్ గోరెద ముందు వెన్కలటుపై నిల్వంగ పార్శ్వంబులన్
చెల్వొందన్ దిశలన్నిటన్ నిలుచుచున్ క్షేమంబు చేకూర్తువే
నిల్వన్ నామది నాసనంబు పగిదిన్ నిర్భీతిమై నిల్తురా
జాల్వారంగ దయారసమ్ము ఘనమీశా భక్త కల్పద్రుమా! 33

చెప్పన్ జూతును మేలు సేయుమనుచున్ చేకొమ్మునన్నంచునే
తప్పున్ చేయుటకాదొకో సతత సంత్రాతన్ నినున్ కోర్కెలీ
చొప్పున్ జెప్పుట సందియమ్మగుననన్ చోద్యంబు నాకయ్యెడిన్
చప్పట్లా ననుభక్తుడంద్రు జనులీశా భక్త కల్పద్రుమా! 34

నక్షత్రంబుల బాటపై గృహములెన్నన్ తోచుమేషాదులై
దీక్షంబూనియు సంచరించు తరినాదిత్యాది ద్యోచారలున్
వీక్షించన్ బహుభంగులన్ గలుగగా తీక్ష్ణార్తి తత్రాతవై
సాక్షాద్రక్షకుడీవె నాకు నిజమీశాభక్తకల్పద్రుమా! 35

శూన్యంబందున పూర్ణమై వెలుగుటన్ సూచింపగా సర్వమున్
విన్యాసంబుగ వ్యోమకేశుడగు నీ విస్తారమున్ గాంచినే
ధన్యోహమ్మని నీకు మ్రొక్కులిడెదన్ దాక్షిణ్యమున్ జూపవే
జన్యంబై స్థిర భక్తి కల్గునటు లీశాభక్తకల్పద్రుమా! 36

(శూన్యం ఆకాశము)

మూలాధారము నీవె యందరికి సమ్మోదమ్మధిష్ఠానమై
లోలోనన్ మణిపూర్ణ సూత్రమటు మాలో నీ విశుద్ధాజ్ఞలన్
హేలన్ జేసి యనాహతమ్ముగను నీవీ రీతి కాపాడినన్
చాలున్ నాకమృతాభిషేకమగునీశా భక్త కల్పద్రుమా! 37

మేఘమ్మై జలమూర్తివై సుఖదమై మేల్గూర్చు సంకల్పమై
మోఘమ్మైన్నని రక్షణా శిఖరమై మోక్షార్థముల్ గూర్తువే
వ్యాఘాతంబులు లేని వాక్కగుచు బ్రహ్మానంద మందింతువే
శ్లాఘింపన్ గిరిశన్తయన్న ఫలమీశాభక్తకల్పద్రుమా! 38

మర్మమ్మేమన శృంగమధ్యముగ సమ్మానించి నిన్ గాంచుటన్
ధర్మమ్మాకృతినొంద నందియగుటన్ దైవంబు నీవౌటయున్
కూర్మిన్ తోచెను ధర్మవర్తనయె చేకూర్చున్ భవద్దర్శనల్
శర్మమ్మొందెడి మార్గమియ్యది పరేశా భక్త కల్పద్రుమా! 39

గర్వోన్మత్తులు సంశయాత్మకులు నాకైనన్న చార్వాకులున్
సర్వాత్మత్వ విభూతినంత నొకచో సాధింపగా సాధ్యమే
పర్వంబౌనని నీదు సన్నిధిని సంప్రార్థింతు నవ్యాజమౌ
శర్వా నీ దయ యొక్కటే వలయునీశా భక్త కల్పద్రుమా! 40

నక్తాదుల్ బహుళాభిషేకములు దానంబెన్న దీపాదులున్
యుక్తమ్మేయగు గాక ప్రీతికరమై యోగింపగా జాలినన్
రిక్తాపేక్షయె శక్తిహీనులకు 'కార్తీకా'దులన్ సల్పగా
శక్తిం గూర్చుచు సాధ్య సిద్ధినిడుమీశా భక్త కల్పద్రుమా! 41

అష్టాంగమ్ముల మ్రొక్కెదన్ శరణమీవంచున్ మనఃపూర్ణమై
శిష్టాచార పరాయణుల్ పగిది నే జీవింపనెంతున్ దయా
దృష్టిన్ జూడుము చేయి వీడకుమయా దీవించి వెన్నంటుమా
స్పష్టంబై భవదష్టమూర్తికననీశాభక్తకల్పద్రుమా! 42

నీ కోపానకు మ్రొక్కెదన్ శరముతో నీదైన చాపానకున్
నా కోసమ్మని వాని శాంతపరుపన్ నాపైకి రాకుండగన్
చేకొమ్మా నుతిసేతు నిన్ను నిజసాక్షీ నీ యఘోరాకృతిన్
సాకల్యంబుగ చూపుమా కొలుతునీశా భక్త కల్పద్రుమా! 43

సత్యంబౌ నుపవాసమన్న చెడునాస్వాదింప పోకుండుటే
సత్యంబౌ నభిషేకమన్న నిను హృత్సంపూర్ణమౌ చింతనే
సత్యంబౌ త్రిదళార్చనన్న గుణముల్ సత్వాదు లర్పించుటే
సత్యంబీగతి నర్చజేయ శుభమీశా భక్త కల్పద్రుమా! 44

శిక్షా రూపము రాక్షసాదులెడ హింసించేవు రక్షింపగా
రక్షామూర్తివి సజ్జనాళికిని సంరక్షింప శాంతమ్ముతో
దీక్షన్ బూనితి నీదు మ్రోల నిలువన్ దీనున్ దయన్ జూడవే
సాక్షాన్మోక్షకరా కృపాజలధివీశా భక్త కల్పద్రుమా ! 45

పాపంబైనను పుణ్యమైనను సదా ప్రారబ్ధమై చేరుగా
ప్రాపున్ గోరితి వాని బాయగ మనోవాక్కాయ సంజాతమౌ
దీపమ్ముండగ చక్కబెట్టుకొనగా ధీవృత్తులన్ కర్మలన్
స్థాపింతున్ భవదంఘ్రి యుగ్మమున నీశా భక్త కల్పద్రుమా! 46

ఈ జన్మాదులకాది మూలమని నిన్నీ జన్మమందందగా
యేజన్మంబులు లేని యోగమునకై యే మార్గమో తోచదే
పూజింతున్ ఫలపూర్ణమౌనటుల సద్బుద్ధిన్ ప్రసాదింపగా
సౌజన్యంబును చూపుచున్ మరువకీశా భక్త కల్పద్రుమా! 47

గంగోత్తుంగ హిమాలయంబులను పొంగారంగ పాపాదులన్
భంగాఖ్యంబని ఖ్యాతినొంది ఘనతన్ భాసించ నీ కేశ పా
శాంగంబున్ విదిలించుచో విదితమౌనత్తింట నీవుంటకై
సాంగోపాంగముగాను సాక్ష్యమగునీశా భక్త కల్పద్రుమా! 48

అల్లంబన్న నెరుంగవో రుచికినయ్యా బెల్లమట్లుండురా
పుల్లంగానను భంగి నేననగ నీ భోగార్థ దేహంబనన్
తెల్లంబౌ విధి స్వస్వరూపమెరుగన్ ధీవృత్తులన్ దిద్దుచున్
చల్లంగా మము కాపుకాయవలె నీశా భక్త కల్పద్రుమా! 49

నేనే సర్వము దైవముండదనుచున్ నిష్ఠూరమారంభమై
నీ నా భేదము నెంచుచున్ పిదప నే నీలోని భాగమ్మనున్
నేనే నీవనె వాసనారహితుడై నీతోడనద్వైతమై
జ్ఞానాపేక్షయు సాధనా గరిమనీశా భక్త కల్పద్రుమా! 50

లింగాకారము లక్ష్యశుద్ధికొరకే లేదిందు సందేహమే
పొంగారున్ నిజ తత్త్వదృష్టియొకటే పూజాదులన్ చేయుచో
బంగారమ్ము గణించు వేళ నగలన్ బాహ్యాకృతుల్ చూతుమే
సాంగత్యమ్మిది సత్యమై నిలుపుమీశా భక్త కల్పద్రుమా! 51

ఈ సంసారము వ్యాధి తాప యుతమైనీదంగ సంక్లిష్టమై
నీ సాన్నిధ్యము చేరి నిల్చితినయా నేర్పున్న వైద్యుండవే
నీ సాయంబును కోరితిన్ సుఖమిడన్ నిర్భీతుడన్ చేయుచున్
శ్వాసాకారుడవై సదా నిలువుమీశా భక్త కల్పద్రుమా! 52

నైరాశ్యమ్మది యావరించు తరి మా నైజమ్మదెట్లుండునో
వైరాగ్యమ్మను భ్రాంతిలో మెసలునో పాటించునో ధైర్యమున్
భారమ్మీవె యటంచు నమ్మి నిలువన్ బాధించునే కష్టముల్
సైరింపన్ సరి లేరు నీకు నిజమీశా భక్త కల్పద్రుమా! 53

ఆమూలాగ్రము నంట మేరువును సంధానింప సర్పంబుతో
నీమూలంబున కూలగా త్రిపురముల్ నేనిత్తురా ప్రీతితో
నామాటన్ వినుమీవికన్ పృథివిగా నా దేహమే తేరురా
స్వామీ గొమ్మిక శత్రులన్ దునుమనీశా భక్త కల్పద్రుమా! 54

శంకాయన్ పరికింపగా నటునిటున్ శంభుండవో శక్తివో
హ్రీంకారాసని ప్రాణమై శివమయెన్ స్త్రీపుంస యోగమ్ముగా
పంకింతున్ కననొక్కటే బహుళమై భాసించ నీ కింకరున్
శంకావర్జితు జేయుచో నభయమీశా భక్త కల్పద్రుమా! 55

ఇష్టానిష్టములంట గట్టి తమదౌనిష్టమ్మె సవ్యంబనున్
శిష్టాచారము వీడి నూత్నగతులన్ చిత్రాల సృష్టింతురా
చేష్టల్ బాపి సనాతనా విమలమౌ చేతస్కులన్ జేయవే
స్పష్టంబౌ ఋజు మార్గగాములుగ నీశా భక్త కల్పద్రుమా! 56

కృత్యంబెయ్యది సవ్యమో తెలుపుచున్ కీడైన ఖండించుచున్
నిత్యానిత్య వివేకయుక్త పథముల్ నీపైని విశ్వాసముల్
ప్రత్యక్షానుభవమ్ము నీయవలెరా ప్రార్థింతు తోడుండగా
సత్యాన్వేషణ యాత్రలో నిరతమీశా భక్త కల్పద్రుమా! 57

సంబంధంబులు లంపటంబులనుటం జంకొంది పెంపొంది డెం
దంబందుండెడు వాంఛలందునుమ ముందందుందువంచందు కం
పంబంతంబిడ వంకలెందుకని సంస్పందింప దంభంబు ధ్వం
సంబొందం నను భ్రాంతులందిడక నీశా భక్త కల్పద్రుమా! 58

కోపంబన్నది చేతకాని తనమౌ గుర్తించినన్ మానినన్
నీపై నమ్మిక సన్నగిల్లినటులౌ నిర్వీర్యతల్ బొందినన్
ప్రాపున్ నిల్చి భయమ్ము బాపి సుఖమున్ రాజిల్ల నిత్యత్వమై
సైపన్ జాలను వేగ బ్రోవుమికనీశా భక్త కల్పద్రుమా! 59

భద్రంబౌ శశి సూర్య వహ్ని నయనున్ పద్మాసనున్ గ్లౌధరున్
ముద్రాపాశ మృగాక్షసూత్ర ధరునిన్ మోహాస్య మృత్యుంజయున్
రుద్రున్ చిత్సుధ మున్గువాని ధవళున్ భ్రూనేత్రు భస్మాంగునిన్
సద్రక్షావ్రతు నిన్ సదా కొలుతునీశా భక్త కల్పద్రుమా! 60



భక్తిన్ సద్గురు సన్నిధిన్ నిలిచి సంప్రార్థింతు జ్ఞానార్థినై
యుక్తుల్ శాశ్వత వస్తు లబ్ధికిననిత్యోపాధి కాధారమౌ
భక్తాభీష్టము తీర్పగా నిపుణుడా వైరాగ్య మెట్లబ్బునో
శక్తిన్ గూర్పుము గమ్యమందుటకునీశా భక్తకల్పద్రుమా! 61

దేహాపేక్షకు చిక్కి యజ్ఞుడగుచో దీనుండగున్ తథ్యమై
దేహాతీతుడనన్ననాత్మవిదుడై దీరుండనన్ యోగ్యుడౌ
స్నేహంబొప్పగ నిత్యముక్తుడగుటన్ శ్రేష్టత్వమున్ పొందుటన్
సాహాయమ్ముగ నాకునీవె గతి యీశా భక్త కల్పద్రుమా! 62

తథ్యమ్మే గమనావరోధమగు సిద్ధ్యాదుల్ సదా క్షీణమౌ
మధ్యాహ్నోత్తర సూర్యునట్లు భ్రమలన్ మాన్పంగ రమ్మన్నచో
బోధ్యాబోధ్యము లెంతువో మరచినావో యేల జాగేలనో
సాధ్యాసాధ్యవిచారణా మిషలనీశా భక్త కల్పద్రుమా! 63

పర్యంకమ్మున పత్నినుంచుకుని ఆ పార్శ్వంబులన్ పుత్రులన్
క్రౌర్యంబెన్నక వాహనమ్ములొకటౌ కైలాస కేళీస్థలిన్
ధైర్యంబాయెను మిమ్మునిట్లు కనగా తాదాత్మ్య చిత్తంబుతో
స్థైర్యంబై నిలుపంగదే సతతమీశా భక్త కల్పద్రుమా! 64



రూపాతీతుడవీవు పల్కవనుచున్  రోదించగా ప్రేమమై
నాపాలిన్ గురురూపమై దరిగొనన్ నన్నుద్ధరింపన్ దగన్
ద్వీపంబై భవ సాగరంబున వెసన్ వేదాంత వాక్యమ్ములన్
స్థాపింపన్ పరువెత్తి వత్తువట ఈశా భక్త కల్పద్రుమా! 65

దేహాంగమ్ముల మంత్రబీజ యుతమై దీపింప నీ తేజముల్
స్నేహామోదము తెల్పి నిల్పుటకునై సేవింతు న్యాసాదులన్
మోహాపేక్షలు దేహభావముడుగన్ మూర్త్యాకృతిన్ కొల్తురా
స్వాహాకార జలాభిషేకములనీశా భక్త కల్పద్రుమా! 66

సన్మానమ్ములు మెచ్చికోళ్ళు ఘనమౌ సంభారముల్ స్తోత్రముల్
సన్మార్గమ్మున హేయమైనవగుటన్ సంకోచముల్ వీడి తా
వన్మాత్రమ్ములు ముక్తిహేతువులు కావంచున్ మదిన్ రూఢిమై
జన్మన్ సార్ధకమొంద సాయపడుమీశా భక్త కల్పద్రుమా! 67

అర్చింతున్ మదిలోననంత గుణధామానంత తేజోమయా
అర్చింతున్ సుఖదా యనంత విభవానంతార్తి విద్రావకా
అర్చింతున్ సరి జూడగా సతమనంతానంతరంగ స్థితా
చర్చల్ మాని యనంత వందనములీశా భక్త కల్పద్రుమా! 68

కేలున్ మోడ్చెద నీదు లీలకునహెూ కృత్యమ్ములైదింటి నీ
వే లోపమ్మును లేకసల్పువిధమీయేడేడు లోకాలలో
నాలోనన్ గలవంతటన్ కలవనన్ నాకేల కన్పట్టవో
జాలిన్ చూప దయామయా కదలుమీశా భక్త కల్పద్రుమా! 69

సంప్రార్థింతు మదిన్ మమత్వముడుగన్ సందిగ్ధముల్ బాయుచున్
సంప్రాప్తింపగ నీ మహత్వమరయన్ సద్విద్య స్వాధీనమై
సంప్రీతిన్ శుభదా కవిత్వమనెదన్ సాక్షాత్కరింపన్ తగున్
సంప్రోక్షించి సదాశివత్వ మిడనీశా భక్త కల్పద్రుమా! 70

సేవింపన్ విషమున్ జగాలు మిగిలెన్ శ్రీనీలకంఠేశ్వరా
సేవింపన్ ఋషు లాత్మవిద్యనిడితో శ్రీ దక్షిణామూర్తివై
శ్రీవాణీశులె కొల్చిరే నియతితో శ్రీ రాజరాజేశ్వరా
సౌవర్ణాదులవేల నీ దరిని యీశా భక్త కల్పద్రుమా! 71

సద్యోజాత ముఖాది పంచకముతో శ్వాసించ మంత్రంబులన్
విద్యల్ వైదిక శాక్త శైవమనుచున్ విష్ణ్వాత్మ కాత్మార్థముల్
మద్యోగమ్మున తోచె పంచముఖ సన్మంత్రంబులన్ పల్కుటే
సద్యస్సార్థక  సప్తకోటి జపమీశా భక్త కల్పద్రుమా! 72

బుద్ధిన్ వక్రత లేమియున్, వినయమున్, భోగాదులన్ త్యాగమున్,
సిద్ధుల్ కోరక యుండుటన్, సమతయున్, శ్రేష్ఠత్వమౌ సాధనల్,
వృద్ధిన్ పొందగ భక్తి భావనలనీవే తీవ్రమోక్షేచ్ఛయున్
శ్రద్ధాసక్తులు నీ పదార్చనలనీశా భక్త కల్పద్రుమా! 73

నిందార్హమ్మగు చేష్టలన్ వదలగా నీ సాయమున్ కోరితిన్
పొందన్ మానుష జన్మ పుణ్య ఫలమై పూర్ణత్వ సంప్రాప్తికై
సందేహమ్ముల బాపుచున్ నను సదా సన్మార్గమందుంచరా
స్పందింపన్ విచికిత్సయేటికికనీశా భక్త కల్పద్రుమా! 74

తన్మాత్రల్ జడముల్, మనమ్ముజడమే, తత్తుల్యమే దేహమున్,
చిన్మాత్రమ్ముగ నాత్మవై, త్రిదశలన్ చిచ్ఛక్తి చైతన్యమై,
మన్మోదాదుల భోక్తవీవనుచు, సమ్మానించు జ్ఞానమ్మునీ
జన్మంబందునె కల్గజేయగదె యీశా భక్త కల్పద్రుమా! 75

చూడంజాలక వ్రేళ్ళులేవనినచో శూరత్వమో మూర్ఖతో
మోడౌ చెట్లకునైనకాంచ పుడమిన్ మూలమ్ముగా నుండునే
చూడంజాలను కాన లేవనెదనంచున్ పల్కినట్లౌను నీ
జాడల్ కాంచమె లోనికిన్ తిరుగనీశా భక్త కల్పద్రుమా! 76



క్రైమోద్భయ్యు గజాస్యుతంద్రికన విఘ్నంబంత పోద్రోతువే
తామే దిక్కిక అంగజారి యనగా తప్పింతువే బంధముల్
కామేశా అగజాధవుండవన భాగ్యంబిచ్చి మన్నింతువే
స్వామీ యెట్లు గజాజినమ్మమరెనీశా భక్త కల్పద్రుమా! 77

ఉత్తుంగార్భటి పొంగు గంగ గిరివాసోరంగ భూషాదులు
న్మత్తుల్ భూత గణాది సేవితుడవై మమ్మీగతిన్ భీతులన్
చిత్తభ్రాంతిని కల్గజేయ సబబే? క్షేమంబిడన్ మాకికన్
సత్తామాత్రమె చూచు చూపునిడుమీశా భక్త కల్పద్రుమా! 78

ఈ రాగాదులు శత్రులై ధృడత మోహేచ్ఛాది పాశంబులన్
కారాగారమనంగ దేహమగుచో గాసిల్లె బంధించ ని
స్సారంబై చను జీవనంబు ఘన సంసారాంబుధిన్ పోతవై
సారాసార విచక్షణల్ గరపుమీశా భక్త కల్పద్రుమా! 79

నీ నైజమ్మది శబ్ద సంపదను వర్ణింపంగ దుస్సాధ్యమై
దానన్ మానసమందు గాంచగ నసాధ్యంబౌట సుస్పష్టమై
మౌనంబూనితి చేష్టమానితిని సమ్మానించి తత్త్వజ్ఞమౌ
జ్ఞానంబిమ్ము రయమ్మునన్ శరణమీశా భక్త కల్పద్రుమా! 80



వృద్ధిన్ పొందితి విద్యలన్ విడుతునీ వృద్ధంపు సంస్కారముల్
బుద్ధిన్ జూచిన మూఢనమ్మికగ సంబోధించి మూఢుండనై
సిద్ధాన్నమ్మును పాడుచేసికొనునా చిత్తమ్ము సైరించుచున్
శ్రద్ధన్ భక్తిని వీడకుండ గనుమీశా భక్త కల్పద్రుమా! 81

శబ్దార్థంబుల నభ్యసించి తెలివిన్ సాధించ వ్యుత్పత్తి నే
నబ్దంబుల్ పరికించినన్ తెలియునే ఆత్మార్థముల్ పొంద ని
శ్శబ్దంబై లయమై మనంబు తెలియున్ సర్వాత్మకంబౌటచే
స్తబ్దంబియ్యది చేతనత్వమని యీశా భక్త కల్పద్రుమా! 82

పాపక్షాళిని గంగ గాంచి గొనిపో వాంఛించి పాత్రంబునన్
స్థాపింతున్ కడు భక్తి భావనల విస్తారాకృతిన్ గాంచుచున్
లోపంబేమిటి విగ్రహమ్ముకనుచో  లోపించు సత్యార్థముల్
చాపల్యంబును బాపి సాయపడుమీశా భక్త కల్పద్రుమా! 83

రమ్మాయుండగ నాకు తోడు హృదినారామమ్ముగా చేసెదన్
మమ్మింకెవ్వరు రక్షజేతురు విరామమ్మీక కాపాడగా
కొమ్మా భక్తి సుమాలు భక్త సులభా! ఘోరామయోన్మూల!  సా
క్ష్యమ్మేలా? సుమనోభిరాముడవె యీశా భక్త కల్పద్రుమా! 84

సర్వోత్కృష్టము స్వాత్మచింతన సరే సాధ్యమ్మె మాకెల్లడన్
సర్వాధిష్టిత శక్తి నీవు సరియా జ్ఞానంబదెట్లబ్బునో
సర్వవ్యాపకమైన నిన్ను కనగా సద్యఃఫలాపేక్షతో
సర్వేశా నిను వేడుకొందు సతమీశా భక్త కల్పద్రుమా 85

ఏదో కోర్కెల కోరజూచు మదినీవెట్టైన లాలించరా
సేదన్ దీరగ నీవె సర్వమనుచున్ సేవింప నిష్కామినై
దేదీప్యంబగు నీదు వెల్గు కనగా దీనత్వమింకేటికో
స్వాదుత్వంబిడు స్వామివీవె కద యీశా భక్త కల్పద్రుమా 86

జాయాపుత్రుల చూచుచో విరళమౌ చాంచల్య చిత్తంబుతో
మాయాజాలము నందునన్ తరళమౌ మా మానసంబెంతయో
ధ్యేయోమూర్తిని నిన్ను నిల్ప తరమే తీర్పంగదే కష్టముల్
సాయంబిచ్చిన తొల్గునీ గరళమీశా భక్త కల్పద్రుమా 87

ఏనీ ధ్యానము సల్పినంత తడవే యీ చిత్తమానందమౌ
ఏనీ నామము పల్కినంతవరకే యీ నాల్క ధన్యంబునౌ
ఆ నీ రూపము కాంచనెంతు వినుమీవాసాంతమై నాదు హృ
త్స్థానంబందున నిత్యమై నిలువుమీశా భక్త కల్పద్రుమా 88

విద్యాగంధము లేనివాని కనవా విద్వాంసులే భక్తులా
ఆద్యంతమ్ములు లేనివాడవు కదా ఆ మధ్య నేలేనటో
వైద్యుండై భవరోగముల్ తివిచి నా వైనంబు చక్కంబడన్
సద్యోహృద్య ఫలప్రదాతవన నీశా భక్త కల్పద్రుమా! 89

కన్నీరే యభిషేక తీర్థమునహంకారమ్మె భస్మమ్ముగా
చెన్నారన్ గుణసంపదే దళములై చేతమ్ము మంత్రమ్మునై
యెన్నన్ నాదను సర్వమీకిడుట నీకీ రీతి సర్వార్చనల్
సన్నద్ధంబగు చిత్తవృత్తినిడుమీశా భక్త కల్పద్రుమా! 90

కైలాసంబున నుందువందురనగా కష్టమ్ము నిన్నంద శ్రీ
శైలాద్యద్రుల జ్యోతివై స్థలజలాంశాదుల్ మహద్భూతముల్
లీలారూపము లేటికో వినవాకో లేవో నభాదుల్ మహా
శైలజ్యోతులు నాదులోపటను యీశా భక్త కల్పద్రుమా! 91

దుర్వ్యామోహము దుఃఖ హేతువగుచున్ దుస్సాధ్యమై తోచురా
దుర్వ్యాపారపు చిత్త వృత్తి నిలుపన్ తోడుండగా పిల్తురా
నిర్వ్యాజంబు కదా భవత్కృప యికన్నీవే నివారింపుమా
స్వర్వ్యాపిన్ శిరమందు చుట్టినటులీశా భక్త కల్పద్రుమా! 92



శ్రీపాదమ్ములు కానవచ్చెననుచో సేవింపగా దేవతల్
స్థాపింపన్ శిరముల్ కిరీటముల నాచ్ఛాదింప నాబోంట్లకున్
ప్రాపుంబొంద నసాధ్యమౌను కదరా ప్రార్థింతు నైర్గుణ్యగా
సైపన్ జాలను నిన్నుబాసిమననీశా భక్త కల్పద్రుమా! 93

ముద్దన్ ముట్టగలేదు లభ్య పడకే ముట్టించె దీపమ్ము తా
సద్దుల్ కానక దొంగిలించు తలపున్ శౌచమ్ము పాటింపకే
పొద్దున్ పుచ్చిన దుర్మతిన్ గుణనిధిన్ పుణ్యాన నీ పర్వడిన్
సద్దున్ చేయక మోక్షమిచ్చితివి యీశా భక్త కల్పద్రుమా! 94

నేనీసూక్ష్మములెంచి చూడగలనా నిన్నెన్నగా నేర్తునా
రానీగాక శుభాశుభంబులవి నీ వ్రాతల్ కదా యోగమౌ
నేనెట్లున్న సరే సదా సలుపుచో నీ యర్చనల్ క్షేమమౌ
స్థానంబొక్కటె నాకు నీపదములీశా భక్త కల్పద్రుమా! 95

జల్పంబే బహు జన్మలెత్తిన నధిష్టానమ్ము నీవన్నచో
కల్పాంతమ్ములు దాటిపోయిన సరే కామాక్షితో నుందువే
తెల్పన్ దాచెద వేటికో తగనొకో దీవింపవే సాధ్యమే
సల్పన్ సాధనలాజ్ఞ నీవిడకనీశా భక్త కల్పద్రుమా! 96



ఇంతింతై భయమెంతయో పెరుగుచో నేరీతి బాపందగున్
చింతాక్రాంతుడనౌచు దారి కనకన్ క్షీణించె ధైర్యంబొగిన్
భ్రాంతుల్దీర్పవె తోడు నిల్వవె సదా పాలింప ప్రార్థింతురా
స్వాంతంబీయగ నీవయేననుచునీశా భక్త కల్పద్రుమా! 97

ఎన్నో జన్మల సంచితంబులగు నా యీనాటి యస్థిత్వమై
నన్నీరీతిగ దుఃఖ సౌఖ్యములలో నౌకావిహారంబుగా
మున్నీటన్ పలునాటుపోటులకునే మూర్ఛిల్ల కాపాడవే
చాన్నాళ్ళేటికి జాగుచేయుటననీశా భక్త కల్పద్రుమా! 98

ఔదార్యంబుగ చేరదీయమని నా యౌద్ధత్యమున్ బాపుచున్
మోదామోదము తోడుతన్  సరగునన్ మోక్షేచ్ఛ దీపింపగా
నాదౌ భాగ్యము పండగా పలికితిన్ నాస్వామి మీవేయనన్
స్వాదున్ గూర్చు దయామయా శరణమీశా భక్త కల్పద్రుమా! 99

అంభోజాసను వ్రాతలన్ కమలనాభాఖ్యుండిదౌ చేతలన్
గంభీరార్థ నిగూఢ వేదశిరముల్ కర్మంపు మర్మంబులన్
దంభంబేటికి యజ్ఞుడన్ తెలియగా దాక్షిణ్య సాకారమా
శంభోశంకర కావగా ప్రణతులీశా భక్త కల్పద్రుమా! 100

భ్రాంతుల్ గూర్చ మరీచికల్పగిదినే భావింతు జీవుండనన్
శ్రాంతంబొందగ తత్వచింతనమున శ్రాంతంబు సాగింప శు
ద్ధాంతశ్చేతన దీప్తమై తెలియునో దారేమిటో తోచదా
సాంతంబీవయె తోడుగా నిలువుమీశా భక్త కల్పద్రుమా! 101

చార్వాకాదులవైదికమ్ములవి దుస్తర్కాది సిద్ధాంతముల్
నిర్వీర్యం బొనరింపకుండ కనుమా నిస్తుల్య ప్రేమాస్పదా
దర్వీపాక రసానుభూతి సుఖమే దాక్షిణ్య భావమ్ముతో
సర్వావస్థల నన్ను వీడవలదీశా భక్త కల్పద్రుమా! 102

ఆవాహాదులనాసనంబిడెద నేనర్ఘ్యాదులర్పించెదన్
నైవేద్యాదుల నుంచెదన్ ప్రణతులన్ నాస్వామిరో చేసెదన్
నీవాల్లభ్యము కూర్పగా శుభములన్ నీరాజనంబిచ్చెదన్
శైవారాధన యంతరంగముననీశా భక్త కల్పద్రుమా ! 103

ఆహా బాగని మెచ్చుకొందురనియా అర్పించుటీ పద్యముల్
దేహాపేక్ష విడన్ పరంబెరుగుగా తీవ్రార్తితోనర్చగా
మోహాదుల్ తొలగన్ శివంబనగ శంభో మంత్ర మామ్నాయమై
సౌహార్దంబగు దర్శనంబునకునీశా భక్త కల్పద్రుమా! 104

బంధంబాయెను లోక వాసనలనన్ వాంఛాది రూపంబునన్
బంధంబాయెను దేహ వాసనయు నా బాహ్యాకృతిన్ మోహమై
బంధంబాయెను శాస్త్ర వాసనసదా వాదేచ్ఛతో ముక్తిదా
సంధింపందగు నీదు పాశుపతమీశా భక్త కల్పద్రుమా! 105

యీ నా సాధన లోన నేర్చిననుచో యే కొంచెమైనన్ ధృతిన్
నానా రీతుల నిల్పుయత్నమనుటే నా వ్రాతలీ రీతిగా
నీ నామార్చన చేయుటన్ శుభదమై నేమంబునన్ నాదు హృత్
స్థానంబందున పూర్ణమై నిలువనీశా భక్త కల్పద్రుమా! 106

బద్ధున్ ముక్తునొనర్చు దేశికుని తత్త్వార్థమ్ము కీర్తించితిన్
సిద్ధించెన్ లలితా గణాధిప రవి శ్రీకాంతు సమ్మాన్యతన్
బుద్ధిన్ తోచిన యంత పద్యశతమై పూజింపగా భక్తితో
శ్రద్ధాభక్తుల నీకివే నతులనీశా భక్త కల్పద్రుమా! 107

ఎన్నో సార ఫలాదులన్ విడిచి నీకెంతైన నీరిష్టమే
ఎన్నో వన్నెల పుష్పముల్ విడిచి నీకీ తుమ్మి పూలిష్టమే
యన్నావందురు సాహసించితిని నాయల్పత్వమున్ నీకిడన్
సాన్నిధ్యమ్మున గొమ్ము పద్యశతమీశా భక్త కల్పద్రుమా! 108

***

